శ్రీః అస్తు.

# కపిలతీర్థమాహాత్మ్యము

వచనకావ్యము.

179. శ్లో

ఇది,

శ్రీమద్భాగవత భవిష్యోత్తరవరాహాది పురాణంబులనుండి

చిత్పురవాసియగు

## పరమాత్ముని రామస్వామయ్యచే

సంగ్రహించి వ్రాయఁబడి

## శ్రీనికేతన ముద్రాక్షరశాలయందు

ముద్రితంబై ప్రకటింపఁబడినది.



# దేవతాప్రార్థన.

గ్రంథకర్తవిరచితపద్యములు.

(1) కం. శ్రీవిఘ్నేశుగజాననుఁ,
దేవేంద్రప్రముఖనిఖిలదేవస్తుత్యున్,
దేవగణాధిపు నెప్పుడు,
భావమునం బ్రస్తుతింతు భక్తిదలిర్పన్.

(2) సీ. పార్వతీహృదయేశుఁ బరమేశుఁ గైలాస
పర్వతేశు మహేశు భవవినాశు,
సన్మునిస్తుతిపాత్రు సదమలచారిత్రుఁ,
బరమపావనగాత్రు భక్తమిత్రు,
హాలాహలాహారు నఖిలలోకవిహారు,
సురుచిరాకారుఁ ద్రిశూలధారు,
సద్భక్తపోషణు సర్వాత్మకారణు,
బాలేందుభూషణు ఫాలనయను,

తే. గీ. భూతనాయకు నక్షయు భువనసాక్షి,
లోకరక్షణు నిజభక్తలోకవరదు,
నీలలోహితుఁ బశుపతి నిర్మలాత్ము,
దేవదేవుని శంకరదేవుఁ దలతు.

(3) కం. శంకరి, మదదానవనా
శంకరి, నిజభక్తమతివశంకరి, భువనా
శంకరి, శంకరుసతిపద
పంకేరుహములకు భక్తిఁ బ్రణతులొనర్తున్.

(4) చం॥ హరిపరమాత్మునచ్యుతు ననంతు నపారకృపాబ్ధిక్షీరసా
గరతనయాహృదీశు, శుభగాత్రు, జగత్త్రయభర్తఁ, బాపసం

హారణుజగద్విహారుఁ, గమలాక్షు, విరాజితలక్షణాంగు, సుం
దరవరమూర్తి, శ్రీధరు, నితాంతము ధ్యానమొనర్తు శేముషిన్.

(5) ఆ. పంచశరునితల్లిపద్మాసనునితల్లి,
గంగతల్లిభక్తకల్పవల్లి,
తల్లితల్లిజగముతల్లివిష్ణుప్రియ,
కవిజనములనెపుడుఁగాచుఁగాత.

(6) చం. సరసిజనాభు పుత్రునికి, సర్వజగంబులసృష్టికర్తకున్,
బరమదయాంబురాశికి, సుపర్వమునీశ్వరసేవితాంఘ్రికిన్,
వరములవేడువారికినహారిగనిచ్చెడుతమ్మిచూలికిన్,
శిరమునహస్తయుగ్మమునుఁ జేరిచిమొక్కెద భక్తిమీరగన్.

(7) కం. వాణిని, ఖగవాహనసుతు
రాణిని, నిజభక్తనివహరక్షణి, వరక
ల్యాణిని, వీణాపుస్తక
పాణిని, నిత్యంబునేను భజియింతుమదిన్.

(8) సీ. శ్రీకరంబై యొప్పు శేషశైలంబున,
నెలకొనిజగములనేలుచుండు,
హరినీలనిభగాత్రువరభక్తజనమిత్రు,
మరకతమణిధారుదురితదూరు,
లలితపీతాంబరాలంకృతుఁ, గాంచన
మణిమయహారుఁ, గృపాసముద్రు,
చారుసాలగ్రామహారవిరాజితు,
రాజితశంఖచక్రాభిరాము,

గీ. సుందరాకారు, సురలోకస్తుత్యుఁ, బరమ
పురుషు, ఘనసారచూర్ణోర్ధ్వపుండ్రధారి,
వివిధవరరత్నభూషణు, వేంకటేశు,
భక్తియుతముగభజియింతుభావమందు.

(9) ఉ॥ శ్రీయుతమూర్తిభానుకులశేఖరురామనృపాలుకార్యధౌ
రేయుని, భక్తపాలనధురీణుని, దీనజనాళిరక్షణో
పాయుని, భవ్యకాయునిఁ, గృపాకరశీలుని, నిత్యసౌఖ్యసం
ధాయుని, నాంజనేయుని, జితారినిఁ, బావనిఁ, గొల్తునెమ్మదిన్.

(10) చం॥ ధరవరవేంకటాచలము దాపుననుద్భవమొంది వేడుకన్,
గరమనురక్తిశిష్టులనుఁగాచుచు దుష్టులనిగ్రహించుచున్,
గరుణదలిర్పభక్తజనకష్టముఁబాపుచువారిముక్తికిన్,
నిరవయియుండునట్టి కపిలేశ్వరుపాదములాశ్రయించెదన్.






## శ్రీ క పి లే శ్వ ర స్వా మి నే న మః.

(11) మత్త॥ కంటినిన్నునఘాబ్ధి దాటఁగఁగంటినీకృపచేత, నీ
వంటిదైవమువేరులేదనుకొంటిమానసమందు, నీ
కంటెనన్యుఁడువేల్పులేఁడనిగట్టిగానినునమ్మినన్,
నంటునేదురితంబులెవ్వరికైన శ్రీకపిలేశ్వరా.

# న వ ర త్న ము లు.

(12) కం॥ గిరిజేశనీస్వరూపము,
సరసిజసంభవునికైనఁజక్రికినైనన్,
నరయుగశక్యముగాదట,
తరమగునేపామరులకుఁ దగనిన్నెఱుఁగన్. ౧॥

(13) కం॥ నీవలనసంభవించును,
నీవలననెవృద్ధినొందునెల్లజగంబుల్,
నీవలనలయమునొందును,
నీవేకారణుఁడు భూతనిఖిలంబునకున్. ౨॥

(14) కం॥ కలఁడందురుకొందఱునిను,
నిలఁగొందఱులేదటంచునెఱుగరునిన్నున్,
గలఁడనిలేదనికొందఱు,
గలవరపడుచుందురెపుడుకైలాసపతీ.

(15) కం॥ ఉగిడెపురుగెవుడునడుసున,
బొరలియుఁబంకంబుమేనఁబొందనిమాడ్కిన్,
దురితపుసంసారాబ్ధిన్,
బొరలియునీభక్తుఁడెపుడుఁబొందడఘంబుల్.

(16) కం॥ కర్మమునఁజిక్కికొందఱు,
నిర్మలపరసౌఖ్యమొసగునిన్నెఱుగకనే
దుర్మతిచేఁజెడిపోదురు,
కర్మవశముమీరిపోవఁగలరెగిరీశా.

(17) కం॥ సకలచరాచరనివహము,
నకుసదనంబైననిన్నునజునికినైనన్,
సుకరంబేకొనియాడఁగ,
సకలజగద్రక్షనిపుణశర్వాణీశా.

(18) కం॥ శిష్టులరక్షించుటకును,
దుష్టులశిక్షింపనీవుదొరవొక్కఁడ,వీ
శిష్టములకన్యులోపరు,
స్రష్టార్చితనీలకంఠచంద్రార్ధధరా,

(19) కం॥ నీవేపరబ్రహ్మంబవు,
నీవేబ్రహ్మయునుహరియునీవేతలపఁగ,
నీవేసర్వప్రపంచము,
నీవొక్కఁడుగాదు నీవెనిఖిలంబభవా. ౧॥

(20) కం. ఏపాపచయంబైనను,
నీపాదార్చనలచేతనిర్మూలంబౌ,
నేపునఁగ్రమ్మెడుచీఁకటి,
దీపముచేరూపుమాయుతెఱఁగునరుద్రా. ౨॥

(21) ఉ॥ ఒక్కఁడెసూర్యుఁడుండియునునొక్కొకనీటిఘటంబులోపలన్
నొక్కొకఁడైవెలుంగుక్రియ, నొక్కఁడవయ్యునునీవులోకమం
దెక్కడఁజూచినన్వెలుఁగుదెప్పుడు పెక్కుస్వరూపధారివై,
చిక్కుచుభక్తవర్యులకుఁ జిక్కకనన్యులకద్రిజేశ్వరా.

(22) కం॥ శ్రీకరశంభుసదాశివ,
ప్రాకటగౌరీకళత్రభవరోగహరా,
నీకృపనొందెడువారికిఁ,
జేకూరకయున్నెముక్తిశ్రీకపిలేశా.

(23) దండకము॥ శ్రీమన్మహాదేవ దేవోత్తమాదేవ తాసార్వభౌమాసు
రేంద్రాదిదేవార్చితా - యోగిసంసేవితా, సర్వభక్తౌఘవల్లీ
లవిత్రాపవిత్రా సుచారిత్రసోమాబ్జమిత్రాగ్నినేత్రా - త్రినే
త్రా, విపద్దుఃఖదుర్మృత్యుదారిద్ర్యసంతాపసంహారసద్భక్తమం
దారసర్వేశ్వరా - శ్రీకరా, చారుశీతాద్రిసంజాతత్రైలోక్య

మాతాసమేతావిధాతార్చితా - శాశ్వతా, నిన్నుసద్భక్తి
సేవించువారందఱుఁ బాపముల్ వాసి యీలోకమందెల్ల సౌ
ఖ్యంబులంబొంది మోక్షంబుఁజేకొందురీశా-గిరీశామహేశా,
హరా సాంబమూర్తీ- స్వభక్తానువర్తీ- త్రిలోకైకకీర్తీ-సదా
నందమూర్తీ-శివాశంకరా కాపిలేశా-నమస్తేనమస్తేనమః ॥

(24) చ॥ జయజయభక్తమానసవశంకరనిత్యశుభప్రదాయకా,
జయజయనీలకంఠపురసంహారసంతతదీనరక్షకా,
జయజయపార్వతీశసురచారణవందితలోకపూజితా,
జయజయలోకపాలననిశాచరభంజనభక్తరంజనా.

(25) కం॥ మంగళముత్రిపురసంహర,
మంగళముత్రిశూలహస్తమనసిజశమనా,
మంగళముత్రిలోచన, హర,
మంగళముత్రిలోకరక్షమహితశ్రేయా.



(26) గీ. గద్యపద్యాత్మికంబగుగ్రంథచయము,
దుర్లభముగాకకొల్లగాదొరకుచుండు,
నప్పటవు గద్యకావ్యంబులరుదుగాన,
రచనఁజేసెదదీనినివచనసరణి.

(27) కం. శ్రీపతిపాదోదకమై,
కాపిలతీర్థంబువెలయుఁగావుననందుఁ,
నోపికమునిఁగెడువారికిఁ,
బాపములన్నియుఁదొలంగిపావనమగుదుఁ.

(28) కం॥ ఒప్పంగపురాణకథలన్,
జొప్పించెదఁగొన్నినిందు సులభపదములన్,
దప్పకనిహపరసాధక,
మిప్పావనచరిత, తప్పులేరకుఁడిందున్.

(29) ఆ॥ దోషమున్ననలిగిదూషణసేయక,
సారమునకుమిగులసంతసించి,
శ్రద్ధతోడదీనిఁజదివెదరనియెల్ల
పండితోత్తములనుఁబ్రస్తుతింతు,

(30) కం॥ ఇక్కపిలతీర్థచరితముఁ,
జక్కఁగసద్భక్తితోడఁ జదివినవినినన్,
గ్రక్కునఁబాపముదొలఁగును,
నిక్కముగాసుఖములమరునిహపరములలోన్.





శ్రీః అస్తు.

# కపిలతీర్థ మాహాత్మ్యము.

(దేవలోకగంగోత్పత్తి వివరణము.)

శ్రీమదఖిలభువన భూషణంబగు భరతఖండంబునం దూర్పు సముద్రతీరంబున మహాబలిపురంబను నొకపట్టణంబుండె. అనేక వివిధ దానంబులచేఁ బ్రఖ్యాతిఁగాంచి మిగుల పరాక్రమశాలియైన బలిచక్రవర్తియను నొక రాక్షసరాజాపురంబును బాలించుచుండెను. అతండుతనబలపరాక్రమింబులచేభూలోకంబునంగలనెల్లరాజులంజయించివారిదేశంబుల నాక్రమించుకొని దేవలోకాధిపత్యంబు వడయంగోరి సురేంద్రునిసాధింప సమకట్టి దండగమనంబు సేసి, దేవేంద్రుని రాజధానియగు నమరావతీనగరంబుఁజేరంజనికోటచుట్టునుం బట్టుగలుగ బలంబుల జవంబునవిడియించి, పొంచి, మార్గంబులెల్ల నఱికట్టుకొని ప్రళయకాలానలుని భంగిభాసిల్లుచున్న, నయ్యసురేంద్రుంగని సురేంద్రుండు భీతిల్లి యసురేంద్రుం గెల్వ నశక్యంబని మనంబున నెంచి సకల దేవతాగణంబులతోడఁ దాను దేవలోకంబువిడిచిపోవ, బలిచక్రవర్తి జగత్త్రయంబునుం దనవశంబుఁజేసుకొని విశ్వవిజయుండై దీర్ఘకాలంబు రాజ్యంబు సేయుచుండె. అప్పుడు రక్కసకులగురుండగు శుక్రాచార్యుండాతనిచేత ననేకయాగంబులఁ జేయించుచుండ, నాయజ్ఞంబుల రాక్షసులు హవిర్భాగంబులం గొనుచువచ్చిరి. ఇట్లు సురలోకంబసురుల పాలగుటయు, యాగహవిర్భాగంబులెల్ల రాక్షసులకుఁజేరుటయు దేవగణంబులెల్ల నెలవులంబాసి ద్రిమ్మరుచుండుటయు, దేవమాతయగు నదితి యెఱింగి తనభర్తయగు కశ్యప ప్రజాపతితోడ మొరయిడ, నాతండు దనమనోవల్లభిపలుకు లాకర్ణించి, క్షణమాత్రంబు చింతించి తనజ్ఞానదృష్టిచే భావికాలకార్యంబాలోచించి యిట్లనియె.

ప్రాణేశ్వరీ; నీవు చింతింపవలదు. రాక్షసాధిపతియగు బలి నింతబలంబుగలుగుటయు, సురలోకంబతని కధీనంబగుటయు, సత్యదేకచక్రాధిపతియై త్రైలోక్య రాజ్యసామ్రాజ్యంబు వడయుటయు, నిదియంతయు విష్ణుమాయదక్క వేఱొక్కటిగాదు. కాన నీవు సర్వాత్మకుండును, జగదీశుండును, నగు నారాయణసేవ జేసితివేని దానం గృతార్థురాలవగుదువని పలికినం బతికి సతియిట్లనియె.

స్వామీ! పరమేశ్వరుండగు నాహరినిం ధ్యానించుటెట్లు, మంత్రంబెయ్యది, ఆచారంబులెయ్యవి, యనియడిగిన నాగృహిణికి గృహస్థుండు పయోభక్షణంబను వ్రతంబుపదేశించి, తత్కాలంబును, దన్మంత్రంబును, దద్విధానంబును, దదుపవాస దానభోజనప్రకారంబులును, నెఱింగించిన, నదితియు పండ్రెండు దివసంబులు హరిసమర్పణంబుగా నా వ్రతంబుసేయ, నావ్రతాంతంబున శ్రీమన్నారాయణుండామెకుం బ్రత్యక్షంబై నంగనుంగొని. కృతాంజలియై యనేకవిధంబుల నప్పరమేశ్వరునుతించి, యసురలచే సురలకుంగలిగిన యిడుములనుచువ, నాకర్ణించి దరహాసితవదనుండై హరి యదితికిట్లనియె.

అదితీ! నేను నీసేమంబునకును భక్తికనిమెచ్చి నీకుం బ్రత్యక్షంబైతిని. నీకోరికందీర్ప నామనంబున కెంతేనియు సంతసంబగుచున్నయది. దైత్యులను వినయోపాయంబులచే జయింప నలవియేకాని బలంబుచేజయింప శక్యంబుగాదు. కాన దేవతులెల్ల హర్షింప, నేను నీకుం బుత్రుండనై పుట్టి, దానవుల రూపుమాపి, సురలోకంబునకు మరల సురేంద్రుని నధిపతిగావింతునని పురుషోత్తముండానతిచ్చితిరో హితుండయ్యె. అంతనయ్యదితియుం గృతకృత్యయై సంతోషంబునం దనభర్తయగు కశ్యపునాశ్రయించి సేవించుచుండం, గొంతకాలంబునకు గర్భంబుదాల్చె. ఆచూలాలికి నెలలంతకంతకెక్కుచును, నసురుల నిర్మూలమునకు నెల్లలుసమీపించుచునుండ, విశ్వగర్భుండామె గర్భ

మందు దినదినంబునకుఁ బూర్ణుండై పెరిగిన, నామెకుఁ బ్రసవకాలంబు డగ్గఱె. తదనంతరంబున జతుర్ముఖుండరుగుదెంచి యదితిగర్భవాసుండై యున్న యక్కమలసంభవునుద్దేశించి యనేకవిధంబుల స్తుతియించి, చెచ్చెఱ నదితిగర్భంబు వెలువడి చిరకాలంబుగా విచ్చలవిడిలేక వర్తించుచుండు సురగణంబులం బ్రోవుమని ప్రార్థించిన, నజ్జగన్నాథుండు శంఖచక్రగదా కమలకలిత చతుర్భుజుండును, పిశంగవస్త్రుండును, మకరకుండలమండిత గండభాగుండును, శ్రీవత్సవక్షుండును, నలినచక్షుండును, నిరంతర శ్రీవిరాజితవనమాలికా పరిష్కృతుండును, గనక కంకణకాంచీవలయాంగద నూపురాలంకృతుండును, గమనీయ కౌస్తుభాభరణుండును, నిఖిలజనమనోహరుండును నై యవతరించి, దినదిన ప్రవర్ధమానుండై సాయుధసాలంకారంబగు తనదివ్యరూపంబుఁ బాసి, గుజ్జురూపంబుధరియించి నిక్కపువటునికైవడి చరించుచు నుపనయన వయస్కుండై తల్లిముందర సముచితాలాపంబులాడుచుఁ గ్రీడించుచుండె.

అంత నబ్బాలకునకు మహర్షులు కశ్యపప్రజాపతిం బురస్కరించుకొని సముచితోపనయన కర్మంబులు సేయించినఁ, గొంతకాలంబునకు నక్కపటవటుండు దేశాంతరసమాగతులగు విప్రులం గొందఱఁగని భూసురోత్తముల దానంబులచే దృప్తిఁజేయు భూవరుం డెవ్వండైన గలండేయని వారలనడిగిన వారలావటువున కిట్లనిరి.

భూసురోత్తమా! భూసురులకు నిష్టార్థంబులిచ్చుటచేఁ బ్రసిద్ధి జెందియుండు భూవరుండు బలిచక్రవర్తి యొక్కండు దక్క నొక్కరుండును లేడు. ఆచక్రవర్తి యిప్పుడు భార్గవానుజ్ఞతో నధ్వరశతంబొనర్చుచుండెడి. నీవాతని యాచించిన నీదారిద్ర్యంబు వోలంగు. జయ్యన నయ్యాగంబునకుఁ జనుమనిన, భూసురులపలుకు లాకర్ణించి జగదీశ్వరుండు కడురిక్తునికైవడి వేషంబుధరియించి, లోకంబులకుం బ్రీతిపుట్టింపం బయనంబై, తల్లితండ్రులవీడ్కొని, శుభముహూర్తంబున

గడలి రక్షోవిభుని చెంతకు భిక్షాగమనంబు సేసి, బలిమఖాంతర్వేదికా వాటంబుదాటి, సభామంటపంబు దరియంజొచ్చి, వేదఘోషంబు లాలకించుచు, హోమగుండంబులందుఁ ద్రేతాగ్నుల వెలిఁగించు యాజకప్రకరంబులవీక్షించుచు, బహువిధాధ్వరవిధానంబులుసెప్పెడు సభ్యులంజేరిచర్చించుచు, తర్కించుచు, మఱికొందరంజేరి జటలుసెప్పుచు, గోష్ఠిసేయుచు, ముచ్చటలాడుచు, ననేకవిధంబుల నందఱికన్నిరూపులై వినోదించుచు, నక్కపటవటుండు నిక్కంబగు రిక్తవిప్రుని చందంబున రక్కసఱేని చెంతకుంజని, కుశపవిత్రాక్షతసంయుతంబును, లోకరక్షణ ప్రశస్తంబును, నగు తనదక్షిణహస్తంబుసాచి, వేదోక్తాశీర్వచనంబులతోడ నక్షతలాతని శిరంబుననిడిన, బలియాతనికి నమస్కరించి, యుచితపీఠంబుననునిచి, యాతనిచరణంబులందుడిచి, తనభార్య కాంచనపాత్రంబున జలంబులువోయ నవ్విప్రునిపాదంబులు గడిగి, తడియొత్తి, తత్ప్రక్షాళనోదకంబులు నిశాచరదంపతులు శిరంబులంజల్లుకొనిన ననంతరంబ నాయసురేంద్రుండావడుగున కిట్లనియె.

ఓ భూసురవర్యా! నీవెవ్వండవు. నీవాసస్థలంబెయ్యది. నీరాకవలనన నే ధన్యుండనైతి. నావంశంబును నాజన్మంబును నేడుపావనంబయ్యె. నాయొనర్చుయాగంబు యోగ్యంబయ్యె. నాకోరికెలెల్లనీడేరె. నీవాంఛదీర్ప నే సిద్ధంబుగనున్నవాఁడ. నీకువలయునవి వస్త్రంబులో, కాంచనమో, ఫలంబులో, వన్యంబులో, గోవులో, గజంబులో, యశ్వంబులో, రత్నంబులో, రథంబులో, కన్యలో, గృహంబులో, గ్రామంబులో, భూములో, మఱియేవియో యెఱింగింపుమని ధర్మయుక్తంబుగాఁ, బలికిన బలివచనంబులకు మనంబున హర్షించి ధాత్రీసురేంద్రుం డిట్లనియె.

ఓ దానవేంద్రా! నాయునికి పట్టిట్టిదని నేనెట్టుల గట్టగపక్కాణింతు; నేను సర్వవ్యాపకుండనై యుండువాఁడ; నేనెవ్వరివాఁడనని

నుడువుదు; నేను స్వయంభువు, నాకెవ్వరును చుట్టంబులు లేరు; నావృత్తాంతంబటుండనిమ్ము. నీవింద్రాది దేవతలం జయించి త్రిలోకాధిపతియును, దానగుణప్రధానుండును నై, దానవ జనపాలనంబు సేయుచున్నవాఁడవు. హరులును, కరులును, గ్రామాదులను, నీకును నీతుల్యునకును దగియుండుగాని, యొంటివాఁడనైన నాకవియనర్హంబులగుటంజేసి నేవాటింగోరనొల్ల. నాకు మూడడుగులభూమి నొసంగెదవేని నేదానందృప్తింజెంది యుండెదనని కపటవిప్రుండుపల్కఁ నాతనికి దానవేంద్రుం డిట్లనియె.

ఓ విప్రుఁడా! నీవు పసిబాలుండవగుటంజేసి యుచితదానంబులడుగ నేరనైతివి. నీవు కోరుకోరిక లీడేర్ప నేనుద్యుక్తుండనై యుండ నీవిట్టి యల్పదానంబుగోరుట నీయభాగ్యంబుగాని వేఱుగాదు. నాదాతృత్వప్రాబల్యంబించుకయైన నీవుమనంబున నెంచక పోవుటంజేసి నీవిట్టి యల్పఫలంబునొందితివి. జగత్త్రయంబున నొక్కజగంబు గోరియుండినను నేనునీకిచ్చియుందునని వగచుచుండు దాతకు యాచకుండిట్లనియె.

దనుజేంద్రా! నేనత్యాశనొందువాఁడగాన, మూడడుగుల భూఖండంబె నాపాలిటికి బ్రహ్మాండంబు. నాకుంచగినకొలంది నేవేడికొంటిఁ గాన పదత్రయంబును లేదనక నాకిచ్చిన నేనతితృప్తుండ నయ్యెదనని పలుకుచున్న యుర్వీసురునకు నుర్వీనాథుం డుర్వీదానంబు సేయందలంచి, యాకపటవటునికి చరణప్రక్షాళనంబుసేసి, తత్పావనజలంబు శిరంబునంజల్లుకొని, విధివిధానంబుగఁ బాదత్రయధరణీతలం బక్కపటధరణీసురునకు దానంబొనర్చె; నట్లు బలిచక్రవర్తిచేసిన దానంబునకాతని నెల్లరుగొనియాడిరి. అట్లు నమ్మాయావటుండాసురారాతిచే భూదానంబుగ్రహించి యేదానంబును భూదానంబునకు సమానంబుగానేరదు కావున, ధాత్రీదానంబొసంగిన నీవిహపరలోకంబులం గీర్తిసుకృతంబుల వడయుదువని బలికింబలికి, మాయాభిక్షుకుండగు లోకరక్ష

డుండు విశ్వరూపంబు ధరియించి, సర్వంబునుదానయై భూలోకంబెల్ల నొక్కపాదప్రమాణంబుగావించి, మఱియొకపాదంబున దేవలోకంబెల్ల నాక్రమించుకొని, మూడవపాదంబునకు స్థలంబుఁ జూపుమని బలి నడిగిన, నాయసురాధిపతి భీతుండుగాక మూఁడవపాదంబు దనశిరంబున నిడుమనినుడివిన, విష్ణుండట్లచేసి యాతనిబాతాళలోకంబునకుం బంపె.

విశ్వరూపధరుండైన త్రివిక్రముండు దనపాదంబుచే సురలోకంబాక్రమించుచో, నాపాదంబు బ్రహ్మలోకంబుందాకఁ, గమలసంభవుండాయున్నత చరణకమలంబునుం గనుంగొని. తనకమండలోదకంబునఁ దత్పాదసేచనంబొనర్ప, నజ్జలంబులు మందాకినీయను నామంబున వినువీథింబ్రవహించె. తదారభ్యంబగు నాప్రవాహంబు నిరంతరంబును సర్వకలుషహారంబును నై దేవగంగయనంబేర్కొని దివిజలోకంబునం బ్రవహించుచుండు.

(భూలోకగంగోత్పత్తి వివరణము.)

పూర్వమయోధ్యాదేశంబును సగరచక్రవర్తియను నొకరాజోత్తముండు పాలించుచుండె. ఆతనికిఁ బుత్రసంతానంబు లేమింజేసి యాతండు భృగుమహర్షింగూర్చి హిమవత్పర్వతంబున ననేకవేలసంవత్సరంబులు ఘోరతపంబొనర్చి యామహర్షి యనుగ్రహంబున దనప్రథమభార్యయగు కేశినివలన నొక్కపుత్రునింగాంచి,ద్వితీయకళత్రంబగు సుమతియను నామెవలన నఱువదివేవురసుతులంబడసె. అంతఁగొంత కాలంబునకా నరనాథుం డశ్వమేధయాగంబు సేయంగోరి, హిమాచలవింధ్య శైలమ్ములకునడుమ యాగశాలనిర్మించి, యధ్వరప్రయత్నంబొనరించి, యధ్వరాశ్వంబాచేరువవిడిచి, తనయగ్రమహిషివలనం దాఁబడసిన యసమంజసుండను పుత్రునకుఁ బుత్రుండును, దనకుఁబౌత్రుండును, నగు నంశుమంతుండనువాని నాయాగపశువుంగావ నియ

మించె. అప్పుడయ్యంశుమంతుండా యశ్వంబురక్షించుచుండ, సు[illegible]
ద్రుండసురుండై యటకేతెంచి, యాహయంబును మ్రుచ్చిలించుకొని
పోయి పాతాళలోకంబుఁజొచ్చి, యచ్చట దపంబుసేయుచుండు [illegible]
సంయమిచెంతఁగట్టివైచి తానపరిమితానందుండై సురలోకంబునకే[illegible].

అనంతరంబ భూపాలుం డశ్వంబుగానక [illegible]
యఱువదివేవురపుత్రులంగని, యశ్వం బెవ్వండో తస్కరించి [illegible]
యున్నాడు, కాన మీరందఱెవ్వఁడే నెదలి సుల్లోకంబు [illegible]
బట్టి నిర్జించి యశ్వంబుం దెండుపొండని యానతిచ్చిన, [illegible]
క్రమంబులు మెఱయ బ్రహ్మాండంబు నింపగర్జించుచు [illegible]
లోకంబెల్ల రయంబునం గ్రుమ్మరి, ధరణిన్నొక్కొక్కలు [illegible]
క్కొక్క డొక్కొక్క యోజనంబు వంతున ద్రవ్వ [illegible],
పూర్వదిగ్భాగంబునుండి భూమండలంబునుం బ్రదక్షిణంబుగాఁ ద్రవ్వనా
రంభించి రసాతలముందాఁకఁ ద్రవ్వుచు, భూ[illegible], జల
చరంబులనిర్జించుచు, దృష్టిబడువారి [illegible],
వీఁడ యాగవిఘ్నకరుండనియు, హింసించుచు, [illegible]
బుల జీవహింస సేయుచుండ, నమరగంధర్వసిద్ధాదులు [illegible], బ్రహ్మ
కడకేగి, యీయుత్పాతంబులు సెల్లడిసేయఁ, [illegible]నుండు గపిల
మహామునికోపాగ్నిచే సగరకుమారులు భస్మంబులగుదురని నుడివి
దేవతల సమాధానపరచిపంపె. సగరనందను లంతకంతకు శౌర్యంబు
లుప్పతిల్ల నశనిపాతధ్వనులంబోలె నార్భటించుచు, [illegible]ప్రదక్షిణంబుగాఁ
గల యంద్రవ్వియు నెచ్చటను నశ్వంబు గానరైరి. సగరనందనులచేఁ
ద్రవ్వబడినవగుటచే సముద్రంబులు సాగరంబులనంబరగు. అంతవారు
పాతాళలోకంబునకుంజని యచ్చట నష్టదిగ్గజంబులంగని నమస్కరించి
తురగాన్వేషణంబుసేయుచో, నొక్కయెడఁ గపిలమహాముని తపంబొనర
్చుచుండుటయు, నాతని చేరువ నొకకట్టుకుం గుఱ్ఱంబు గట్టఁబడియుం

డుటయుఁ, గని వారి మనంబుల రోషహర్షంబులు పెనంగొన నొం డొరులకిట్లనిరి.

ఈకపటమునీంద్రుండే హయతస్కరుండుగాని వేఱొకండుగాడు. ఈచోరుండు గుఱ్ఱంబుదొంగలించుకొని యిటకువచ్చి నిక్కపుఋషీశ్వరుండువోలె నేత్రంబులుమూసికొని తపంబొనర్చునట్లు నటించుచున్నవాఁడు. కాన నీతనివధియించి వేగంబుగ తురంగంబుంగొని పోవను చితంబని యఱువదివేవురును నొక్కటై నిజకరాయుధంబులం ఝుళిపించుచు నమ్మునీంద్రుఁడాయుచో, నాసంయమీశ్వరుండలిగి నేత్రంబులుదెరచిచూడ, నాతనికోపాగ్నిచే నాసగరనందను లఱువది వేవురును మడిసి భస్మరాసులైరి. పుత్రులశ్వంబుంగొని రాఁదడసిరని సగరుండు దనమనుమండగు నంశుమంతునింబంచిన, నతండు దమతండ్రులచొప్పునంజని, పాతాళలోకంబుంజొచ్చి యందు భస్మరాసుల చెంతనున్న తురంగంబుంగని యచ్చటనున్న కపిలమహామునింజూచి నమస్కరించి, యనేకవిధంబులనాతని స్తుతియించి, హయంబు విడువుమని వేడక, తనతండ్రులు భస్మంబగుటకుజింతించుచు, నమస్కరించి నిలువంబడియున్న యంశుమంతుం జూచి కృపానిధియగు కపిలుం డిట్లనియె.

బాలకా! నీపినతండ్రుల మరణంబునకు నీవు చింతించనేటికి? వారి పూర్వజన్మసంస్కరణానుసారంబుగ వారికట్టి మరణంబులు సంప్రాప్తంబయ్యె. నీవశ్వంబుంగొని చని నీతాతకప్పగించి నీపినతండ్రుల భస్మరాసుల నాకాశగంగచేఁదడిపిన, వారు పరలోకసుఖంబులు వడయుదురని నీవాతనికెఱింగింపుమని పలికిన, నంశుమంతుండామహర్షికి నమస్కరించి హయంబుంగొనిపోయి సగరునకిచ్చి కపిలమహాముని నుడివిన తెఱంగాతనికెఱింగించిన, నాసగరుండాపశువువలనయాగంబు గడతేర్చె, యంశుమంతునకుఁ దనరాజ్యంబప్పగించి, ముక్తబంధనుండై

కపిలుం డానతిచ్చిన ప్రకారంబునం దనపుత్రులం బరలోకసుఖంబులందం జేయం గడంగి, యాకాశగంగ నుర్వికిం దెచ్చుటకై కమలసంభవుం గూర్చి ముప్పదివేల సంవత్సరంబులు దపంబు సలిపి తపోఫలంబుం గాంచకం బరలోకగతుం డయ్యె.

అంత నాతనిమనుమండగు నంశుమతుండు ముప్పదివేలవర్షంబులు చతుర్ముఖుం గూర్చి తపంబొనర్చి విఫలుండై దేహంబు విడిచిన, నాతనిపుత్రుండగు దిలీపుండును నట్లు ముప్పదివేలసంవత్సరంబులు దపంబొనర్చి రోగంబులచేం బీడింపంబడి మృతుండయ్యె. పిమ్మట నాతనిపుత్రుండగు భగీరథుండు దనవారందఱునుం దపోఫలంబులందకం బరలోకగతులగుటకుం గడు చింతిల్లి తనరాజ్యంబున బ్రధానులనిలిపి, వనజసంభవుం గూర్చి గోకర్ణాశ్రమంబునం బదివేలవత్సరంబులు ఘోరతపంబొనరింప, నాతనితపంబునకుం గమలాసనుండు మెచ్చి యాతనికిం బ్రత్యక్షుండై వరంబు వేడుమనిన బ్రహ్మకు భగీరథుండు గడుభక్తిం గరంబులు మొగిచి యిట్లనియె.

ఓవిధాతా! నాతాత లిప్పటికి నూరువేల వత్సరంబుల క్రిందటం గపిలుని కోపాగ్నిచే మడిసి పాతాళలోకంబున భస్మరాసులై యున్నవారు. ఆభస్మరాసుల దివిజగంగచేం దడిపినం గాని వారలకు సద్గతులు గలగ నేరవని యమ్మునీంద్రుం డానతిచ్చి యుండుటం జేసి, సురలోకగంగను ధరాతలంబునకుం దెచ్చునట్లు నాకు వరంబొసంగుమని భగీరథుండు వేడ నాతనికిం బ్రజాపతి యిట్లనియె.

రాజేంద్రా! నీవు కోరినయట్లు దివిజగంగ భూలోకంబునకు వచ్చునట్లనుగ్రహించితి. ఇప్పుడు వినువీధిం బ్రవహించుచుండు గంగ యడ్డులేక నేలంబడిన, నయ్యుదకంబులు నిరర్గళప్రవాహంబై మేదినీ తలంబెల్ల నిండి భూతలంబును భేదించి పాతాళలోకంబునకుం జని, రెండు జగంబుల నుదకంబులచే నించి నశింపంజేయుం గాన, నంతరిక్షంబుననుండి వచ్చు

గంగం దాల్పఁ హరుం డొక్కరుండ గాని వేఱొక్కఁడు సమర్థుండు గాఁడు. నీ వాతని బ్రార్థించి గంగను దెచ్చికొనుమని చతురాననుండానతిచ్చి తిరోహితుండయ్యె, నంత భగీరథుండు మహేశ్వరుంగూర్చి యొక్క యంగుష్ఠంబవనిపై మోపి యనేకశతవత్సరంబులు ఘోరతపంబొనర్ప, నాతనితపంబునకు మెచ్చి ఫాలాక్షుండాతనికిఁ బ్రత్యక్షంబై, మందాకినిం దన శిరంబునం దాల్ప నొప్పికొనిన, భగీరథుండు గంగం బ్రార్థింప సురలోకంబుననుండి గంగ వెల్వడి లోకంబు లెల్లఁ బగుల నతిఘోరంబుగ మ్రోయుచు భూలోకంబునకుం దిగంబడియె.

అట్లు పెచ్చుపెరిగి విచ్చలవిడి నింగినుండి యుర్వికిం బర్వు గంగం గని యంగజహరుం డాగంగ గర్వంబుఁ బాపందలంచి, తన జటాజూటంబుం బెంప నాగంగ వచ్చి యమ్మహాదేవు జటాజూట మహాటవిం జొచ్చి యందుండి వెలువడి పోవఁ ద్రోవం గానక యచ్చట దిరుగుడు పడుచు వర్తింపుచుండె. అంత భగీరథుండు వెఱగంది త్రిపురారాతి న్వేఁడ, నావిషకంధరుండు దనమౌళియందున్న గంగను భూలోకంబునకుం బొమ్మనియనుప, నాగంగ భూతాధిపతిజూటంబుననుండి పాతాళంబునం జూపు నిలిపి యుప్పొంగి యుప్పొంగి బ్రహ్మాండభాండంబుల్వగులం బెల్లుబ్బి, ధరాతలంబుతట్టు ప్రవహించి హిమాచలప్రాంతమందుండు బిందుసరస్సుం జొచ్చె. ఆసరస్సునుండి యాజలంబు లేడుపాయలై, పావని, హ్లాదిని, నలిని, యను నామంబులచే మూడుపాయలు తూర్పుదెసకును, చక్షువు, సింధువు, సీత, యను పేర్లచే మూడుపాయలు పడమటిదెసకును బ్రవహించి మఱియొకపాయ భగీరథుని వెంటంబోయి భాగీరథియనం బేర్కొనె. అట్లు సురలోకగంగ భూతలంబునకేతెంచి బిందుసరస్సుం జొచ్చి యందుండి యేడుశాఖలై ప్రవహించి యందొకపాయ భగీరథుని వెనువెంటఁ బాతాళలోకంబునకుం బోవుచుండ, మార్గంబున నొక్కయెడ జహ్ను మహాముని యాగంబొనర్చుచుండఁ గా, నయ్యాగోపకరణం

బులన్నియు నాగంగా ప్రవాహంబునం గొట్టుకొనిపోయి జన్నంబునకు విఘ్నంబుగలుగ, నమ్మునీంద్రుం డాగ్రహించి నింగికిం బొంగి చెలంగుతరంగంబుల న్వాలుంగు నాగంగం దనదక్షిణకరకమలంబున నాకర్షించి యొక్కక్షణంబునం బానంబొనర్చె. అంత భగీరథుండు విగతమనోరథుండై కొంతదడవు మంతనంబునం జింతించి, యాజహ్నుమహర్షి ననేకవిధంబులం బ్రార్థింప, నాసంయమివరుండు దయార్ద్రచిత్తుండై తనకర్ణరంధ్రంబునం దాగంగ న్వెడలించి ప్రవహింపంజేయ, నదికారణంబుగా నాటనుండి యాగంగ జాహ్నవియను పేరం బరగుచుండు.

కపిల తీర్థోత్పత్తి వివరణము.

ఇట్లు జహ్నుమహాముని కర్ణరంధ్రంబునుండి యాగంగ వెల్వడి భగీరథుని వెంటం బ్రవహించుచు రసాతలంబు సొచ్చి సగరనందనుల భస్మరాసుల చెంత కేగుచుండ, నక్కడ నొక్కప్రదేశంబున హరికళావంశజుండును, గర్దమమహర్షిపుత్రుండును, నగు కపిలమహాముని శిలాలింగంబొక్కటిం గావించుకొని శివపూజ యొనర్చుచుండ, భగీరథుం డామునీశ్వరుంగని, గంగ యచ్చోటం బ్రవహించి యాసంయమి దేవతార్చనకు భంగంబు గలిగించిన, నాఋషీంద్రుండు జహ్నునివడువున నాగంగ న్గ్రోలి వాంఛాభంగంబొనర్చునని వెఱచి, భక్తివశమానసుండై యాసంయమిపద వనజంబులకు వినయంబునం బ్రొక్కి యిట్లనియె.

మునీంద్రా! నేననేక శతసంవత్సరంబులు తపంబొనర్చి యనేక యిడుములం బడి, భస్మరాసులై నీచెంతం గూలియున్న నాపినతండ్రులకుం బరలోకగతులు గల్పింప నీయాజ్ఞానుసరణంబుగ నాకాశగంగ న్నిరసాతలంబునకుం గొనితెచ్చినాఁడ. ఇయ్యెడ నాగంగ ప్రవహించి నీ వర్చించుచుండు మహేశ్వరలింగంబును, బూజాద్రవ్యంబులన్నియును, బ్రవాహంబునం గలసి నీశివార్చనకు భంగంబు గలిగిన, నీకోపాగ్నికి నే పాత్రుండ నగుదు. కాన నాయందుం గరుణించి నీవీస్థలంబు విడిచి చనిన,

గంగాజలంబు లిచ్చటఁ బుష్కలంబుగఁ బ్రవహించినాపినతండ్రులభస్మ రాసులందడిపి వారలకుఁ బరలోకసుఖంబులొసగి, నన్నుఁ గృతార్థుంజేయునని పలికిన నాభగీరథునకుఁ గపిలుం డిట్లనియె.

రాజేంద్రా! నానుడివిన తెఱంగున నీవిన్ని యిడుములంబడి తెచ్చినగంగ నీపినతండ్రుల బవిత్రులంజేయుట యుచితంబు. నీవు గైకొనివచ్చిన యీగంగా ప్రవాహంబునుండి యొకశాఖ నావెంబడివచ్చునట్లనుజ్ఞయొసంగెదవేని నేనీ మహేశ్వరలింగంబుతోడ భూలోకంబునకుంజనియెదనని కపిలుండువాక్రుచ్చిన, భగీరథుండందుల కియ్యకొని యాజాహ్నవీదేవింబ్రార్థింప, నాగంగాప్రవాహంబునుండి యొకపాయభూలోకంబునకుంబోవునట్లా జాహ్నవియనుగ్రహించె. తదనంతరంబ కపిలుండు కైలాసపతిచే నట నమ్మునీంద్రుండర్చించుచున్న యాలింగంబు భూమినింభేదించుకొని భూతలంబున శేషాచలంబునకు దక్షిణదిగ్భాగంబున నుద్భవించి కపిలలింగంబనం బేర్కొనియె. ఆమహేశ్వరలింగంబు వెంటఁ గపిలుండును, భాగీరథీజలంబులుచు, బాతాళంబునుండి భూలోకంబునకుంబఱతెంచి, యాకపిలలింగంబునకుఁ బశ్చిమదిక్కునఁ గంగాజలంబులిరవుగైకొని యొక్కసరోవరంబై కపిలతీర్థంబను నామంబునం బేర్కొనియె. ఆమహేశ్వరలింగంబునకుఁ జెంతఁ గపిలమహాముని యొకయాశ్రమంబు నిర్మించుకొని యాతీర్థంబున స్నానసంధ్యాదికృత్యంబులం దీర్చుకొనుచు, నాసరోవరజలంబుల రుద్రాభిషేకాదికృత్యంబులకు వినియోగించుకొని యాశంకరలింగంబు నర్చించుచు, చిరకాలంబచ్చట తపంబొనర్చుచుండె. రసాతలంబున శేషించియుండు గంగాజలంబులు సగరనందనుల భస్మరాసులపైఁ బ్రవహించివారికిఁబరలోకసుఖంబులుగలిగించె. ఇట్లు శ్రీమహావిష్ణు పాదపద్మప్రక్షాళనజలపూరితంబగు నాకపిలతీర్థంబు నిరంతరపయోధరంబును, సమస్తపాపక్షయకరంబును, సర్వమంగళప్రదంబును, సకలజన మనోహరంబును,

నపరిమిత జంతుజాలసేవ్యమానంబును,ననేకబ్రాహ్మణజన జీవనాధారం
బును, దివ్యపరిమళోదకపూర్ణంబును, నిష్టకామ్యార్థ ఫలదాయకంబును
పుణ్యవృద్ధిహేతుభూతంబును, సకలతీర్థయాత్రా ఫలదాయకంబును,
సమస్తజన బాహ్యాంతరపవిత్రకరంబును, సమస్తైశ్వర్యకరంబును,నాయు
ర్వృద్ధికరంబును, నిరంతరానేక భక్తజనసేవ్యంబును, ముక్తిదాయకం
బును, ననవరతనగజగంగపతననేత్రానందకరంబును,నై యొప్పుచుండు.

ఆతీర్థంబున శ్రద్ధాపూర్వకంబుగ స్నానంబు జేయువారు పాప
రహితులై మోక్షార్హులగుదు రదియునుంగాక, తత్తీర్థంబున శ్రాద్ధంబొ
నర్చువారి పితృదేవతల మృతపానంబు జేసినంత తృప్తినొంది, యనవర
తంబు స్వర్గలోకసుఖంబు లనుభవించుచుండుదురది యెట్టులనిన.

(శ్రీమన్నారాయణ దేవతాధిక్యము.)

పూర్వ మొకప్పుడు కశ్యపాదిమునివరులు గంగానదీ తీరంబున
నొక్కచో యాగంబొనర్ప నుద్యుక్తులై త్రిమూర్తులయందు యజ్ఞఫ
లభోక్తయగు దేవుండెవ్వాఁడని తమలోఁదాము వితర్కించుచుండ,నార
దుండాతరి నచ్చటకేతెంచిన, యాగఫలభోక్త యెవ్వాండని కశ్యపాది
సంయమీశ్వరులు కలహాశనునడుగ, వారికి నారదుండిట్లనియె,

మునీంద్రులారా! మీరు సత్క్రతువులంజేసి లోకంబులకు సుఖం
బులు గలిగించుచుందురు. మోక్షప్రదుండగు దేవుండెవ్వాఁడని విచా
రించి యా దేవునకు సవనఫలంబుల నర్పించిన, మీకును నిహ పరలోక
సుఖంబులుగలుగుగాని, పాత్రాపాత్రంబు లెఱుంగక మీరు సవనఫలంబు
లుసమర్పించిన మీకట్టి యాగంబులవలన నిహ పరలోకసుఖంబులుగ
లుగ వట్లగువలన, మీరు త్రిమూర్తిపరీక్ష యొనర్చి ముక్తిప్రదంబైనమూ
ర్తికి యాగఫలంబులర్పింపుఁడని నియోగించి నారదుండరిగె.

అంత నమ్మును లెల్లం గుమిగూడి మూర్తిత్రయంబున మోక్షప్ర
దుండగువాని నెల్లుం బరీక్షించు నుపాయంబు యోజించి, ముక్తప్రదంబైన

మూర్తిని విచారించుకొనిరమ్మని భృగుమహామునినంపిన, నమ్మునీంద్రుం డుదొలుత సత్యలోకంబునకేగి తపోజనపరివృతుండై కొలువున్న బ్రహ్మ న్వీక్షించిమ్రొక్కి యాకమలాసనుండనుజ్ఞనొసంగక మున్నా తండుగూర్చుండినంజూచి విధాతగ్రోపోద్దీపితమానసుండై, కోపంబాంతరంగంబున నడంచికొని భృగునితోమాట్లాడకనుండినం గనుంగొని, యామునీంద్రుండు, బ్రహ్మరజోగుణ ప్రధానుండుగాన మోక్షప్రదుండు గాఁడనియెఱింగి యాచతుర్ముఖునకు భూలోకంబున నాలయంబు లేకుండునని నిశ్చయించి, దిగ్గునలేచి రజితాచలంబునకుంబోయి పార్వతీసమేతుండై క్రీడించుచున్న కైలాసపతింగాంచి నమస్కరించిన, నప్పుడా మహేశ్వరు చెంతనున్న గౌరీదేవి లజ్జాక్రాంతయై దవ్వునకరుగ, నట్టితరి నమ్మునీంద్రుండటకేతెంచెనని క్రోధమానసుండై భాషింపకుండిన త్రినేత్రుంగని, భృగుండారుద్రుండు తమోగుణ ప్రధానుండగుటవలన నతండు ముక్తిప్రదాతకాఁడని తెలిసి, యాముక్కంటికి శరీరపూజ లేకలింగపూజ యగుంగాక యనినిశ్చయించి, యందుండి యాసంయమి వైకుంఠంబునకఱిగి శేషతల్పంబున లక్ష్మీసమేతుండై శయనించి నిద్రించుచున్న శ్రీమహావిష్ణుంగని నిజపదంబెత్తి యాహరి వక్షస్థలమందుఁదన్నిన, నాపాదతాడనంబుచే శ్రీనివాసుండు మేల్కాంచి దిగ్గునలేచియమ్మునికిఁ బ్రదక్షిణనమస్కారంబొనర్చి, యర్ఘ్యపాద్యాదివిధులంబూజించి, యుచితాసనంబిచ్చి, తనుఁదన్నిన యమ్మునిపాదపద్మంబును దనతొడపైనిడికొని యొత్తుచు వినయంబున నమ్మునికిట్లనియె.

మునీంద్రా! నీ యాగతంబెఱుంగక నేపవళించి నిద్రించుచుండినందులకు నపచారినైతి. నాయపచారంబునకుం దగిన శిక్షయొఱింగి నన్ను నీవు పాదతాడనంబొనర్చితివి కాన నాకు పరమానందంబయ్యె. కఠినమగు నావక్షస్థలంబున నీమృదుపదంబుదగిలి నీపదంబెంతనొచ్చెనోయని వగచెదఁగాని నాయురంబున కించుకయైన నొప్పిగలుగదయ్యె,

ననిపలికి యమ్మునీంద్రునికిఁ బాదప్రక్షాళనంబొనర్చి, తత్తీర్థంబు శిరంబు నం బ్రోక్షించికొని, భాసురంబగు భూసురపదరేణు వీసుదినంబున నాశిరంబునంసోకి నేధన్యుండనైతినని పల్కి, భృగుమహాముని సంతసంబం భయభక్తియుక్తంబుగ హరి ననేకవిధంబుల స్తుతియించి యాపుండరీకక్షునీడ్కొని చని, భాగీరథీతీరంబున యజ్ఞంబులు సేయుచున్న కశ్యపాదిఋషులం జేరి, త్రిమూర్తులందాను పరీక్షించి బ్రహ్మ రాజసగుణుండనియు, రుద్రుండు దామసగుణుండనియు, హరి సత్వగుణుండనియు, దానెఱింగినవృత్తాంతంబా సంయములకుం జెప్ప, వారలాకర్ణించి సంతసించి శ్రీమన్నారాయణుండొక్కఁడే మోక్షప్రదాతయని నిశ్చయించి క్రతుఫలంబులన్నియు నారాయణునకే సమర్పించుచుండిరి. కాన ముక్తిదాయకుండగు శ్రీమహావిష్ణు పాదపద్మ ప్రక్షాళన జలంబులవలనఁ గలిగిన కపిలతీర్థంబున భక్తియుక్తంబుగఁ గ్రుంకులిడువారికి ముక్తి గలుగుట నిస్సందేహంబు.

(శ్రీమహావిష్ణు పాదస్పర్శప్రభావము.)

తొల్లి గౌతమమహర్షి పత్నీసమేతుండై యొకయాశ్రమంబునఁ దపంబొనర్చుచుండ, నొకనాటిరాత్రి దేవేంద్రుండు కుక్కుటరూపంబున గౌతమాశ్రమంబు కడకువచ్చి నడురేయిం గూయ, నామునీంద్రుండా కోడికూతవిని తెల్లవారుజామాయెనని తలంచి, తనవాడుకచొప్పున స్నానాద్యనుష్ఠానంబులందీర్చుకొన జెంతనుండు నదికిం బోవ, నాతరివేచియుండిన నింద్రుండాలస్యంబు సేయక గౌతమాకారంబుగైకొని గౌతమాశ్రమంబుం బ్రవేశించి, యాసంయమీంద్రు సతియగు నహల్యాదేవింబొందిమరుకేళిందనిపి, మరలిపోవ నుద్యుక్తుండై యుండు సమయంబున, గౌతముం డెదురువచ్చుటంగని భీతిల్లి, నిర్జరేంద్రుండు మార్జాలంబై యాఋష్యాశ్రమంబునం దిరుగుచుండె; నంత నాగౌతముండా సురాధిపతి కృత్యంబును దన దివ్యదృష్టివలన నెఱింగి కోపించి, యాతనింగని

నీవముష్కుండవై నీశరీరంబంతయు యోనిమయంబగుఁగాకయని యా సురేంద్రుని శపియించిన, నాశాపంబఖండమై యాతనియండంబు లప్పుడే యూడిపడి యాతనిదేహంబెల్ల యోనిమయంబయ్యె. గౌతముం డంత నహల్యాదేవింగని నీవు పాషాణంబై యెండ గాలి వానలనుండుదువు గాక యనిశపియించె. అంత నాయహల్యా సురేంద్రుల మ్మునీంద్రునకు భయభక్తులనమస్కరించి మాకిచ్చినశాపంబుల కంతంబులెవ్వియనియ డుగ, వారికి గౌతముం డిట్లనియె. దేవేంద్రా! నీశాపంబున కంతంబు లేదైనను నీదేహమందలి యోనులితరులకు నేత్రంబులవలెఁగనుపడుచు నుండునని చెప్పిన నట్లయయి, యాకారణంబున దేవేంద్రునకు సహస్రాక్షుండను నామంబుగలిగె; నటనాసంయమి యహల్యంగని శ్రీమన్నారాయణుండు రామావతారంబున నిన్నుఁ గాలంద్రొక్కిన నీకు శాపవిమోచనంబగునని పలికినన్నిన, నహల్యాదేవి తత్క్షణంబ పాషాణంబై పడియుండె; నంత సురలు దేవేంద్రుని తెఱంగెఱింగి యాతనికి మేషవృషణంబులుదెచ్చి సంధించిరి. అదిమొదలు మేషంబులు శ్రేష్ఠంబులై యాగంబులంజంపఁ బడుచుండు. శ్రీమహావిష్ణువు దశరథపుత్రుండై విశ్వామిత్రమహర్షి వెంట మిథిలానగరంబునకుంబోవు సమయంబున, నహల్యా శాపప్రకారం బెఱింగిన కౌశికుండా దాశరథిం గౌతమాశ్రమంబునకుం గొనిపోవ, జిరకాలంబుగా శిలారూపంబై పడియున్న యహల్యాదేవి, మష్టుగడిగినబంగారువోలె, శ్రీరామపాదపంకజ ధూళీకృతాఘ సందోహయై శిలారూపంబుమాని తనతొంటి శరీరంబుదాల్చె మఱియును.

మున్ను సుదర్శనుండను గంధర్వుండొక్కఁడు రూప సంపద్వర్గంబులంజొక్కి విమానంబెక్కి దిక్కులంజరించుచుండ, నొక్కయెడ నాతండు కురూపులైన యాంగిరసాది ఋషులంగనినగిన, నీవు రూప దర్పంబున మమ్ముంగని నగితివికాన నీవు సర్పంబై యీయడవిననుందువని వారాతని శపియించిరి. విద్యాధరుండా శాపంబునకు మిగులచిం

తించియస్మునీశ్వరులసవినయంబుగఁబ్రార్థించిన వారుదయార్ద్రచిత్తులై యతని కిట్లనిరి.

భక్తరక్షణార్థంబుగ జనార్దనుండు యదుకులంబున శ్రీకృష్ణుండై యుదయించి యొక్కదినంబున నీయరణ్యంబునకు రాగలండు. నీవాతనిపదంబునం దన్నంబడి శాపవిముక్తుండవగుదువని యామునీంద్రులు వక్కాణింప నాగంధర్వుండు చయ్యన లీలావిహారంబుమాని లేలిహానంబై యాకాంతారంబునఁ జరియించుచుండె.

అంత నొక్కనాఁడు శ్రీకృష్ణుండు నందాదిగోపకులంగూడి యావనంబుననుండు నంబికాదేవి దర్శనార్థమైయటకుంబోయి, సరస్వతీనదీజలంబుల స్నానంబులొనర్చి యాయుమాదేవి నర్చించి కానుకలిచ్చినాటి రాత్రి యాయాలయంబున నివసించియుండ, సర్పరూపంబున నాయాలయంబున వసియించియున్న గంధర్వుండచట నిద్రించుచున్న నందు నింగఱచి చుట్టుకొనిన, నందుండు మేల్కాంచి భీతచేతస్కుండై మొఱయిడఁ, జెంతనిద్రించుచున్న శ్రీకృష్ణుండు నిగ్గునలేచి నందునిఁ జుట్టుకొనియుండిన సర్పంబునుఁ బాదతాడనంబొనర్ప, నాసర్పంబు సర్పరూపం విడిచి తన తొల్లిటిరూపంబగు గంధర్వరూపంబుఁదాల్చి హరికిమ్రొక్కి తనవృత్తాంతంబెఱింగించె. ఇట్టి ప్రభావంబుగల పాదసేచనోదకంబుల చేనైన కపిలతీర్థంబెట్లు ముక్తిదాయకంబుగాకుండు నిదియునుంగాక.

శేషాచలోత్పత్తి వివరణము.

అనిలుండొకనాఁడు శ్రీమహావిష్ణుదర్శనార్థంబువై కుంఠంబునకుం బోవ, హరిమందిరద్వారమునందాతఁడే గావలియున్న శేషుండాపవను వీక్షించి, లోనికింజనవలదని వాయుదేవునడ్డగింప, నమ్మారుతుండు నిలువక నాగాధిపుందిరస్కరించి లోనికింజనుచుండ, శేషుండాగ్రహించి కసుఱ్ఱుజేసి వాతూలునిమెడబట్టిగెంటె.

అంతనాగంధవహుండు రోషావేశంబు ప్రాంగ శేషుని దుర్భాషలందిట్టిన, మారుతుం డోర్వఁజాలక మారుదుర్భాషలం బలుకుచు నిరువురును దామొకరికంటె నొకరుబలవంతులని కలహించుచుండ, వారిరభసంబువిని హరిలోపలనుండి వారిచెంతకువచ్చిన వాతూలుండు హరింగని యిట్లనియె.

దేవా! సర్వజీవాంతర్యామియు సమస్తజగదాధారుండనునైన శేషునికన్న బలవంతుండనైయుండు నన్నీనాగాధముండు దృణీకరించి మెడబట్టిత్రోసి నాకుఁబరిభవంబొనర్చెనని పలికినవిని శేషుండు గోపాటోపంబున నిట్లనియె.

వైకుంఠపతీ! బహువిధబ్రహ్మాండభాండోదరుండైన నిన్నును, విపులాద్రిగణయుతంబగు ధరాతలంబును, భరియించుచుండు నేనీతని కన్న బలవంతుండుగాని తక్కువైనవాఁడగాన. కాన నాకాహారంబైన నీతండు నన్నుఁ దృణీకరించుట యుచితంబుగాదని పలికిన హరివారి రువురి వివాదోక్తులాకర్ణించి వారి కిట్లనియె.

మీయిరువురిబలతారతమ్యంబుల నేనూరక నెఱుంగనేర. నేనొక యుక్తి చెప్పెద. మీరట్లొనర్చెదరేని సుకరంబుగ మీబలాబలంబు లెఱుంగఁదగునని శ్రీహరి యానతిచ్చిన వారందుకు సమ్మతింప శేష తల్పుండు శేషునకిట్లనియె.

పన్నగేంద్రా! మేరుపర్వతంబు కడనాగిరీంద్రంబునం బుట్టిన వేంకటాద్రియను నొక నగంబుగలదు. నీవాపర్వతంబు చుట్టుంజుట్టు కొనిఫణంబుల బిగఁబట్టి యదుముచుండ, వాయువు దనబలంబుచేనా కొండనెగరమీటిన, నీకన్న నాతండు బలవంతుండనఁదగు. సమీరుండట్లు సేయనోపక పోయిన నీవాతనికన్ననధికుండవగుదువని పలికి సమీరుం గనిరమావల్లభుం డిట్లనియె.

మారుతా ! పన్నగేంద్రంబు చేఁజుట్టంబడు వేంకటగిరిని నీవు నీబలంబుచేఁ బైకినెగరమీటినట్టయిన నీవాతనికంటె నధికుండనంబడుదువు, లేకపోయిన పన్నగేంద్రుండు నీకన్న బలాధికుండ నందగునని విష్ణుండానతిచ్చినవిని మహాప్రసాదంబని మ్రొక్కి పవనశేషు లిద్దఱును మేరుపర్వతంబుఁజేరంజనిరి. అందు నాగేంద్రుండచ్చటనున్న వేంకటాద్రిచుట్టునుంజుట్టుకొని, సహస్ర ఫణంబులబిగఁబట్టి యుండెనంత, గంధవహుండు నిజశక్తింబెంచి యాగిరిపై వీచుచుండె.

అట్లా వేంకటాచలంబుపై నిజశక్తి కొలఁది మారుతుండ నేకదినంబులు వీచుచుండఁ దుదకాపర్వతంబు దన్నుజుట్టియున్న శేషునితోడ గాలిపటంబువలెపైకెగరి, తిరుపతిపురంబునకుత్తరభాగంబునం బడియె. ఇవ్విధంబున నాగాధిపు నోడించితినని సంతసించుచు, మారుతుండు వైకుంఠంబునకుంజని తనజయంబు హరికివిన్నవించె.

శేషుండు దానోడుటకు మిగులఁజింతించుచు మరలవైకుంఠంబునకుఁ బోవలజ్జించి యా వేంకటనగంబునుం జుట్టుకొనియున్న పట్టువదలకయున్నంగని బ్రహ్మాది దేవతులాతనికడకు వచ్చి యాతనినాదరించిరందు బ్రహ్మ శేషునకిట్లనియె.

నాగేంద్రా ! నీవుపవనునకోడితివని చింతింపవలదు. నీవీపర్వతంబువదలి గిరిరూపంబున నవనిపై నుండెదవేని నీపై శ్రీనివాసుండనవరతంబువసించు నట్లొనర్చెదనని శేషునకభయంబిచ్చి బ్రహ్మాదులు నిజనివాసంబుల కరిగిరి. అంత శేషుండు వేంకటాచలంబునంజుట్టినచుట్టువదల్చుకొని లేచి, యాపర్వతంబుపై శిరంబుసోకఁ జాగిలఁబడివైకుంఠపతికి సాష్టాంగదండ ప్రణామంబొనర్చుచుఁ బర్వతాకారంబునొందె. అందు ఫణాగ్రప్రదేశంబు వేంకటాచలంబనియుఁ, మధ్యప్రదేశం బహోబళంబనియుఁ, బుచ్ఛప్రదేశంబు శ్రీశైలంబనియుఁ బ్రసిద్ధిఁ జెందియుండు.

ఇట్లేర్పడిన నావేంకటాచలంబు సర్వక్షేత్రసర్వతీర్థమయంబును, నఖిలఫల ద్రుమపుష్పలతాశోభితంబును, నానావిచిత్ర ధాతుప్రకాశంబును, నై విలసిల్లుచు, శేషునకు వరంబిచ్చి పోయిన పరమేష్ఠిప్రార్థ నానుసరణంబుగ వైకుంఠపతికినివాసంబై, యఘంబులకెల్లభయంకరంబును, సమస్త దేవతా వాసంబును, సకల మునిజన సేవ్యంబునునై యొప్పుచుండు.

ఇట్లువైకుంఠపతికి వాసంబగుటచేఁబవిత్రంబైన వేంకటనగంబు నుండి ప్రవహించుజలంబులా కపిల తీర్థంబునం గలసి యా తీర్థంబును నింకయుఁబావనంబుగా నొనర్చుచుండు.

(కపిలతీర్థప్రభావము.)

శ్రీకాళహస్తిపురంబునఁ బురందర సోమయాజి తనయుండగుమాధవుండను నొకవిప్రుండుండె. అతండొక్కదినంబునఁ దనభార్యయగు చంద్రరేఖను దివారతికింబిల్వ, నామె పెద్దలింటనుండు సమయంబునఁ బగటిరతి దగదని యనేకవిధంబుల భర్తకుంజెప్ప, నాతండువినక మదనప్రేరితుండై కామోద్రేకంబుఁబట్టజాలక నామెను బలాత్కారంబుసేయగాఁ,బతియాజ్ఞమీరుట ధర్మంబుగాదని యెఱింగిన యాచంద్రరేఖని జథవున కిట్లనియె. మీరు సమిత్కుశ తులసీ పుష్పార్థంబుగ నదీతీరపుష్పవనంబందుండిన, నేనచ్చటికుదకంబుదెచ్చుటకై కలశంబుగొనివచ్చి యచ్చట మీసంకల్పంబు నెరవేర్చెదనని సమ్మతిపఱుప, నావిప్రుండుచయ్యన స్వర్ణముఖరీ నదీతీరంబందున్న పుష్పవనంబుంజేరి యచ్చటికంత కుముందువచ్చి కాంచనభూషణ ధవళాంబరాలంకృతురాలై దీర్ఘనీలకుంతలంబులుమెరయ గూర్చుండియున్న కుంతలయను పక్కినిజాతి చండాలస్త్రీనింగని మోహించె. అట్టిసమయంబునఁ దనసతి యటకుపచ్చినం, జూచి, నీగుణపరీక్షకై రమ్మంటి నంతియకాని దేవతార్చనాగ్నిహోత్రాదిసత్క్రియ లాచరించు దివాసమయంబున రతిక్రీడసలుప నేనొప్ప

దు నేయని చెప్పి యామెనింటికిం బంపి, యాచండాలస్త్రీసమీపంబునకుం బోవుచుండ, నది యావిప్రుంగని లేచి మ్రొక్కి దవ్వునకరుగుచుండ, మాధవుండును దానిం వెంటబోయిన, నా బ్రాహ్మణునింగాంచి యాచండాలస్త్రీ యిట్లనియె. నేను చండాలస్త్రీయని చెప్పకొన లజ్జించి దూరంబునకరుగుచుండ, నేచండాలస్త్రీయని నీవెఱుంగక నీవును నా వెంటవచ్చుచున్నావు. నీవు దూరంబున కలుగుమని చెప్ప, నాధరణీసురుండు దానిన్విడిచి పోంజాలక మఱిమఱి వెంబడించి పోవుచు, నాస్త్రీకిట్లనియె. ఓలలనాశిరోమణీ! నీవంటిసౌందర్యవతిని బ్రహ్మదేవుండు నీచజాతియందుం బుట్టించి యడవినగాచిన వెన్నెలకరణి యొనర్చినందుకా విధి నేమందు! లవణసముద్రంబునం బుట్టినరత్నంబుల దేవతలు శిరంబులంధరించు తెఱంగున నీచజాతివైననిన్ను నేవరియించినా కౌగిటం జేర్చికొని యెదనని యావిప్రుండు లజ్జయుడిగి వివరంబుగ బల్కిన నాతనికా స్త్రీయిట్లనియె.

బ్రాహ్మణోత్తమా! స్త్రీపురుషజాతిద్వయంబునుం గల్పించి నాలుగుజాతుల నిర్మాణంబొనర్చి యేజాతిపురుషుండా జాతిస్త్రీని విధ్యుక్తంబుగ వివాహంబు జేసికొని స్వభార్యయందు సంతానంబు వడసి పరస్త్రీసంగమంబపేక్షించక నుండవలయునని ధర్మశాస్త్రంబులు చెప్పుచుండ, నీవట్టిధర్మంబుల నెఱింగియు చండాలస్త్రీసంభోగంబునకాశించువగునే? బ్రహ్మకులంబునం బుట్టి జాతకర్మాది షోడశకర్మలకు నర్హుండవై యుండి నీవు నన్నంటందగదది యెట్లనిన; నీదేహంబు వేదపూరితంబై నీశ్రోత్రనేత్రనాసాపుట జిహ్వాపాణిపాదంబులు పుణ్యకథాశ్రవణభగవద్దర్శనహరిపాదార్చితతులసీపుష్పాఘ్రాణవేదాధ్యయనదానతీర్థయాత్రాదిసత్క్రియలచేతం బవిత్రంబులైనవి. మదీయశ్రోత్రప్రముఖేంద్రియంబులు దుష్కథాశ్రవణాది దుష్క్రియలచే నపవిత్రంబులైనవి. కాన, నాశరీరసమాగమంబు నీవపేక్షించందగదని ధర్మశాస్త్రోక్తంబుగం బలుకుచున్న

యా స్త్రీనింజూచియోర్వజాలకనవ్విప్రుండావనితంబట్టు కొనంబోవఁగా నదిపాపభీతిచేరోదనంబొనర్చుచు, దేవతలనుద్దేశించి,యావిప్రుండునీచ జాతినైననన్నుం గలసిజాతిభ్రష్టుండై నరకంబులోఁబడను ద్యుక్తుండై యున్నాఁడు, నావలన దోషంబులేదు, మీరందఱిందులకు సాక్షులనిచె ప్పితొలఁగిచనుచుండ, నాబ్రాహ్మణుండు బలత్కారంబుగ దానింబట్టి కలసె, నంతనది యతనింగని బ్రాహ్మణా! నీవు కులహీనుండవైతివి, నీవింకయజ్ఞోపవీతవిసర్జనంబొనర్చి చండాలజాత్యాహారుండవై నన్నుం గూడియుండుమనిన నందులకాతండియ్య కొనిదానితోడ గృష్ణవేణీ తటంబున ద్వాదశవర్షంబులు కామ భోగంబులనుభవించుచుండె. అంతఁ గొంతకాలంబునకుఁ గుంతలమృతినొందిన, మాధవుండు దుఃఖాక్రాం తుండై యొంటరిగా సంచరించుచు మఱికొంతకాలంబునకు వివేకుండై, తనపూర్వపవివేకంబునకుం బశ్చాత్తాపంబు నొందుచుండె.

ఇట్లుండ, నొక్కనాఁడుభక్తులు గొందఱామార్గంబున వేంకటా ద్రికింజనుచుండ, నాజాతి భ్రష్టుండువారి వెంటంజని, దారియందువారు విడిసినస్థలంబుల దానునునిలిచి, వారుభక్షించి పారవైచిన యెంగిలి యన్నంబుందినుచు, వారుకపిలతీర్థంబునకరుగ దానునువారితోడనా పుణ్యస్థలంబునకుంబోయి, పర్వతంబునుండి దుముకుచుండు గంగంగని నమస్కరించి, వారాతీర్థంబునమునుఁగుచుండ, నాతీర్థంబునుండివెలికిఁ బ్రవహించుజలంబులందానుగ్రుంకి, వారందరు క్షౌరంబు సేయించుకొను చుండఁ దానును వపనంబుసేయించుకొని, యాప్రవాహంబున నెమరల మునిఁగి, వారుపిండప్రదానంబులు సేయుచుండంగని తానునుమృత్తిక తోఁబిండంబులు సేసి యాతీర్థోదకంబులం బ్రోక్షించి తనపితృదేవతల. కర్పించిన, నామృత్పిండంబులన్నపిండంబులయ్యె. అంతనతనిపితృదేవ తలతినికిఁ బ్రత్యక్షంబైయాపిండంబులం భుజియించి తృప్తినొందిరి.

తొలుతనాకు లభిస్తుండాకపిలతీర్థంబునం గ్రుంక, నతండొన ర్చియుండినపాపంబులన్నియు నశించిపవిత్రుండై మరల బ్రహ్మత్వంబు నొందినకతంబున, నాతనిపిత్రుదేవతల కతండుభక్తిపూర్వకంబుగనర్పిం చినమృత్పిండంబులాతీర్థోదకప్రోక్షణచే నన్నపిండంబులై యతనిపిత్రు దేవతలకుభోజ్యంబులయ్యె మఱియును.

తొల్లి మాళవదేశంబున సకలవేదశాస్త్రపండితుండును, దేవ బ్రాహ్మణపూజారతుండును, నగునాత్మారాముండను విప్రోత్తముండు విహితధర్మజ్ఞుండై వర్తించుచుండె. కాలవశంబున నాభూసురుండు పిత్రార్జితధనంబంతయు నానాటంగోలుపడి యర్థహీనుండై దారిద్ర్య దుఃఖసాగరంబునంగ్రుంకి యందుండి వెలువడ మార్గంబుగానకతత్త అపడుచు, దారాపుత్రాదులంబాసి, యుదరపోషణార్థంబుదేశసంచార బుసేయందొడంగి, గృహంబువెల్వడి యనేకవత్సరంబులు భరతఖం డంబంతయుగ్రుమ్మరి, మెట్టకేలకు శేషాచలప్రాంతంబునఁజేరి, యందుం డుకపిలతీర్థంబున స్నానసంధ్యాద్యనుష్ఠానంబులందీర్చుకొని తత్తీర్థంబు కడనుండు కపిలేశ్వరుసాన్నిధ్యంబుంజేరి, నిర్మలచిత్తుండై భక్తిపూర్వ కంబుగనమ్మహాదేవుంగనిసేవించి, విపినమందొకమార్గంబుఁ బట్టిచను చుండ, దన్మార్గసమీపంబుననుండునొక గుహామధ్యంబున ధ్యానయోగ గరిష్ఠుండయియుండుసనత్కుమారుంగాంచి, యమ్మునీంద్రునకు సాష్టాం గదండప్రణామంబు లాచరించినిలిచి ముకుళితహస్తుండై యిట్లనియె.

మహాత్మా ! ఏను మాళవదేశవిప్రుండ. నేను దేవభూసురపూజ లొనర్చుచు, దానధర్మంబులంజేయుచు జీవహింసాదిపాతకంబుల కెడ మీయక పరోపకారశీలుండై వర్తించుచుండియుఁ, గాలవశంబున ధన హీనుండై, దారిద్ర్యంబునొంది, దారాపుత్రాదుల రక్షింపనశక్తుండై చింతాభరంబున దేశసంచారంబొనర్చుచున్నాఁడ. కాన, నాయందుఁ గరుణించి నాదారిద్ర్యంబు దొలంగునుపాయంబాన తీయవలయునని

యనేకవిధంబుల నాసంయమింబ్రార్థించిన, నమ్మునిపుంగవుండు ద యార్ద్రచిత్తుండై యావిప్రునకిట్లనియె.

భూసురవర్యా! నీవు పూర్వజన్మంబున మదాంధుండవై యా ర్యులహసించుచు, లోభుండవై దానంబులకడ్డుసేయుచు, నాచారహీ నుండవై యెల్లయెడలంగుడుచుచు, దేవబ్రాహ్మణగురుభక్తిలేకయుం డినందున, నాపాపపుంజంబెల్ల నీజన్మంబున దారిద్ర్యరూపంబున నీవను భవించవలసివచ్చె. నీవిప్పుడు సమస్తపాపక్షయకరంబగు కపిలతీర్థం బున మునింగినకతంబునం, దొలిపుట్టువుననీవొనర్చిన పాపచయంబెల్ల నిర్మూలంబయ్యెంగాన, నీవికదేశాటనంబుమాని స్వస్థలంబుంజేరి దారా పుత్రాదులంగూడిన సమస్తైశ్వర్యయుతుండవై సుఖించుచుండువని యమ్మునీంద్రుండానతిచ్చె.

అంత నావిప్రుండు సంతోషభరితుండై దేశసంచారంబుమాని స్వస్థలంబుంజేరి దారాపుత్రాదులంగూడి, సర్వసంపదలువొంది చిర కాలంబు సుఖించుచుండె.

కపిలతీర్థమాహాత్మ్యము

సంపూర్ణము.





